వుడు పునశ్చరణము జేసి యాచరింపవలెను. బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య రూపుమాసిపోవలెను. హిందూ - మహమ్మదీయ సమస్య గూడ సమసిపోవలెను. అందరము భారతమాతయొక్క యనుంగు బిడ్డలమేయన్న భావము ప్రబలవలెను. విశ్వమానవ సౌభ్రాతృత్వము నుపన్యాసములవల్లను, గ్రంథములవల్లను సమర్థులైనవారు దేశమునకు ప్రబోధము చేయవలెను. హిందువులు, మహమ్మదీయులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, నిమ్నజాతులు వేలకొలది యేండ్లనుండి, యిక్కడనే పుట్టి యిక్కడనే పెరిగి, యిక్కడ గాలి పీల్చి, యిక్కడ నీరుద్రావి, యిక్కడి పాడిపంటలనుభవించి, భారతమాతృస్తన్యపానముజేసి యిచ్చటనే వర్ధిల్లిరి. పరస్పర ద్వేషములు వినాశకారకములుగాని, శ్రేయోదాయకములుగావు. పేదసాదలను భేదముండకూడదు. శ్రీరాముడెవరు? బ్రాహ్మణేతరుడు గాడా? వారలను భగవంతుడని యన్నివర్ణములవారు పూజించుటలేదా? పన్నిద్దరాళ్వార్లలో పెక్కండ్రు బ్రాహ్మణేతరులు లేరా? వారిని దేవతార్చన పెట్టెలోనుంచుకొని పూజించుటలేదా? భారతము బ్రాహ్మణేతరులైన పాండవుల చరిత్రమేగదా? దానికి పంచమవేదమని పేరు పెట్టి దానిని బ్రాహ్మణులు పారాయణము జేయుటలేదా? విశ్వామిత్రుడు బ్రాహ్మణేతరుడుగాడా? మహాపవిత్రమైన గాయత్రీమంత్ర మతడు గాదా నిర్మించినది. వేదవ్యాసుడెవరు? పల్లెదానికొడుకు అతడే పంచమవేద రచయిత. అతడే నాలుగువేదములు విభజించెను. అతడే పదునెనిమిది పురాణములు రచియించెను. అతడే బ్రహ్మజ్ఞాన గర్భితములైన బ్రహ్మసూత్రములు రచియించెను. వాటినన్నిటిని బ్రాహ్మణాదులు శిరసావహించుటలేదా? బ్రాహ్మణేతరు లెవరు? బ్రాహ్మణులెవ్వరు? చలికి, వానకు, నెండకు, లెక్కసేయక నేలదున్ని పంటలు పండించి మన కన్నముపెట్టినవారెవరు? బ్రాహ్మణేతర సోదరులు గాదా? ఒక కుటుంబములోనివారు తలకొక పనినిబూని కుటుంబ రక్షణము జేసికొన్నట్లు దేశమునందలి యన్ని జాతులవారు తలకొక పరిశ్రమను బూని దేశరక్షణము జేయవలదా? అది మనకర్తవ్యము గాదా? జ్ఞానముగల మనుష్యులు హీనమైన పశువులు, కుక్కలవలె కొట్లాడుకొనుట, కాట్లాడుకొనుట ధర్మమా? జంతువులకు మనకు

భేదముండవలదా ? ఐకమత్యము సర్వార్థ సాధకము. ఐకమత్యముండుటచేతనే గదా గాలి కెగిరిపోవు గడ్డిపోచలు వెంటిగ నల్లబడి మదపుటేనుగును బంధింపగలవు ? ఐకమత్యముచేతనేగదా చిన్నిచిన్ని మర్రియాకులు గుమిగూడి, గలసియుండి, బ్రహ్మాండమంతను దగ్ధముచేయగల సూర్యతాపము నడ్డుకొని, క్రిందనున్న ప్రాణికోటికి నీడనొసగి, సౌఖ్యమొందజేయుచున్నవి ! పరమాణువులు పర్వతముగ గూడి ఝంఝామారుతము నెదుర్కొని చలియింపక నిలిచియున్నవి.



పాపులర్ పవర్ ప్రింటింగ్ ప్రెస్, కాకినాడ.

కళాపరిపూర్ణ

# చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నూతనగ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | చిత్రకథాగుచ్ఛము | రు 1—12—0 |
| 2 | సమర్థరామదాసు | 1— 4—0 |
| 3 | భల్లటశతక | 0— 6—0 |
| 4 | స్వీయచరిత్రము | 4— 0—0 |
| 5 | ప్రహసనములు 1 వ భాగము | 1— 8 - 0 |
| | ,, 2 వ భాగము | 1— 8—0 |
| | ,, 3 వ భాగము | 1— 8—0 |
| | ,, 4 వ భాగము | 1— 8—0 |

ఈ కవిగారి గ్రంథములన్నియు ఈ క్రింది చిరునామాకు వ్రాసిన పడయగలరు.

**చిలకమర్తి పబ్లిషింగ్ హౌస్.**

ప్రొ॥ పి. వి. దీక్షితులు అండ్ సన్.

**కాకినాడ.**

తూ॥ గో॥ జిల్లా.

Popular Power Printing Press, Kakinada.